క. నడిదారినున్న పాముటు
కడువున పైఁజేసి పొరలఁ । గాగని, నూరా
మడమైన దిరుగ మేలగుఁ
జెడివచ్చును తిరుగకున్న । శిఖినరసింహా. 169

తా. ఓ నరసింహస్వామీ ! మార్గమధ్య మందున్న పాము కడుపున పైగాఁజేసి పొరలఁగా చూచినచో; ఆ ప్రయాణము నూరామడైనను తిరిగి, మానవలయును. లేని యెడల కీడుకలుగును.

క. కని నవ్వాడ పడిగె త్తిన
ఘనముగఁ బ్రతుకుదురు శుభము । కల్యాణమగున్
ధనపతు లగుదురు పేదలు
చినరయా బళగిరి విహార । శిఖినరసింహా. 170

తా. ఓ నరసింహస్వామీ! పాము తనను చూచి పడిగె త్తి ఆడినచో శుభము కల్యాణము సిద్ధించును. పేదవారు ధనవంతు లగుదురు.

క. పుట్టపయి సర్పమెక్కిన,
పట్టుగధనమబ్బు, జయము । బహుపేదలకున్
గట్టిగఁ జెడు సంపన్నుఁడు
చిట్టా బళగిరివిహార । శిఖినరసింహా. 171

తా. ఓ అహోబల పర్వతమందు విహరించే నరసింహస్వామీ ! పాము పుట్టపై కెక్కుచుండగాఁ జూచిన యెడల దరిద్రుఁడు ధనికుఁడగును. ధనికుఁడు దరిద్రుఁడగును.

క. చేను మడితోటనుండియు
నానఁగ పడిగె త్తి యాడ । నాఫలమలరుఁ
వానిఁగని పాఱవాఁడా
చేనిఫలముదినఁగ లేదు । శిఖినరసింహా. 172

తా. ఓ నరసింహస్వామీ! రైతు చేనుదగ్గఱకు గాని, మడి దగ్గఱకుగాని పోయినపుడచట పాము పడగవిప్పి ఆడుచుండినచో అవి బాగుగా ఫలించును. అది రైతును జూచి పాఱిపోయినచో అందులో పండిన పంట రైతు అనుభవింపడు.

క. విత్తనము విత్తఁబోయిన
సత్తుగ పడిగెత్తియాడు । సర్పము గంటే,
మొత్తముగఁబండు ధాన్యము
చిత్తము రంజిల్లఁజేయు । శిఖినరసింహా. 173

తా. ఓ నరసింహస్వామీ! విత్తనములు చల్లఁబోవునపుడు పాము పడగెత్తి యాడుట చూచినచో సమృద్ధిగా పండి రైతునకు సంతోషము గల్గించును.

క. పురిమొగ సాలను సర్పము
$ చొరఁబడఁ బురజనుల కమరు । సుఖమును బురముఁ
బరువడిఁ నిలిచినఁ బ్రజలకు
సిరి చెడి రాజాజ్ఞగలుగు । శిఖినరసింహా. 174

తా. ఓ నరసింహస్వామీ! పురము మొగసాలయందు (పురము వాకిటి చావడి) పాముప్రవేశించుటఁ జూచెనేని పురజనులకు సుఖము. పురమొగసాల యందు నిలిచినచో ధననాశనమయి ప్రజలకు రాజాజ్ఞ గలుగును.

---

$ వావిళ్ళవారి ప్రతియందీ క్రింది విధముగానున్నది.

క. పురి మొగసాలను సర్పము, చొరఁ బడుటను గాంచెనేని ♦ శుభములు తొలగున్
పరికింపఁ జనిన కార్యము, స్థిరముగ నాపదలఁ జేయు ♦ శిఖినరసింహా.

ఈపద్యమునందలిభావము వ్యతిరేకముగానున్నది కావున ప్రాజ్ఞులూహించుకొనవలెను.

క. పాము నొకపాము మ్రింగిన
నామహాపడి ప్రజలు సతిను । తాదులును గ్రా
మణ్యముఁ జేసిన ధర,
క్షేమంబులు తప్పి చెడును । శిఖినరసింహా. 175

తా. ఓ నరసింహస్వామీ! పామును యింకొక పాము మ్రింగుటనుఁ జూచెనేని కలుపు వచ్చును.

క. పురమును జొర మొగసాలను,
యురగ ధ్వని కుడినిమేలు । నొవ్వగు శుభముఁ
దరి దప్పి యెడమ వినఁజెడు,
చిలు బుస్సలు వినినివాఁడు । శిఖినరసింహా. 176

తా. ఓ నరసింహస్వామీ! పురము ప్రవేశించు నపుడు మొగసాలయందు కుడివైపున పాము యొక్క కూత వినినచో శుభము. ఎడమవైపున వినినచో కీడు.

క. ఉరగధ్వని విని పురమునఁ
జొరవచ్చును, వెలుపలైన । చో మొగసాలన్,
నెరపైనముఁ బోరాదఁట,
‡ సిరివరదా! § యదుగుఁడైన । శిఖినరసింహా. 177

తా. ఓ నరసింహస్వామీ! బయటనుండి వచ్చెడివారు పాము కూతవిని పురిని ప్రవేశింపవచ్చును. పురినుండి వెళ్ళేటప్పుడు మొగసాలయందు పాముకూత వినబడినచో ప్రయాణము మానవలయును.

క. పామును, పామన శుభమగు,
† బామట పడిగెత్తఁజూడ । బహుశుభమగునా,
పాముతనుఁ జూడఁగనుఁగొన,
జీమూతవు గష్టమగును । శిఖినరసింహా. 178

---

‡ విశే;— సిరిమగఁడా! § యడిగనేని, యడిగడైన పాఠాంతరములు.

† పామను (ట) పడిగెత్తజూడ ♦ బహుసంపదలుం, పాఠాంతరము.

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణమగు నపుడెవ్వరేని "పాము పా" మని అరచినచో శుభమగును. పాము పడిగెత్తియుండ తానుఁ జూచినచో మిక్కిలి మేలు. ఆపాము తనను చూచుట తానుఁజూచె నేని వర్ష భయము కలుఁగును.

క. వలవలిదెస సర్పము గన
తలనెత్తినఁ జుట్టఁబడినఁ । దగపచ్చని చె
ట్టులనెక్కిన సామ్రాజ్యము
జిలువల దొరశుభములొసఁగు శిఖినరసింహా. 179

తా. ఓ నరసింహస్వామీ! పాము తన కుడివైపున కనబడినను పడగనెత్తినను, చుట్ట చుట్టుకొని యున్నను, పచ్చని చెట్టెక్కినను. రాజభోగములు కలుగును.

—: పి ల్లి శ కు న ము :—

(పిల్లి శకునము మూడు ప్రతులలోను లేదు.)

క. శకునముల జూడ వలసిన
సకల క్రియలందుఁ బిల్లి । శకునంబులఁ జూ
డక చేసినఁ జెడు కార్యము
చికిలీకత్తి నఱుకగును । శిఖినరసింహా. 180

తా. ఓ నరసింహస్వామీ! సకల క్రియలందును శకునములఁజూడ వలసినచో; పిల్లి శకునము ముఖ్యము. చూడకుండఁగ చేసినయెడల తుడిచిన కత్తి తెగినట్లుగా పనులు చెడిపోవును.

క. అడ్డముగ పిల్లి వచ్చిన
నడ్డగుకార్యంబులెల్ల । నవసవ్యముగా
బిడ్డవలె చుట్టుఁదిరిగిన
చెడ్డగు కార్యంబులెల్ల । శిఖినరసింహా. 181

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి అడ్డముగా వచ్చినచో కార్యము లన్నియు చెడిపోవును. అపసవ్యముగా పిల్లి తన చుట్టు తిరిగినచో కార్యహాని యగును.

క. చనుచుఁ బ్రదక్షిణముగఁ జు
ట్టినఁ గొంచెపు జెఱుపుకలుగు, । ఢీకొని కాట్లా
డిన కలహంబొనగూడును,
చినయో బళగిరి విహార । శిఖనరసింహా. 182

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి వెళ్లుచు తన చుట్టు ప్రదక్షిణ ముఁగా తిరిగిన యెడల స్వల్పనష్టము. పిల్లులు ఢీకొని కాట్లాడుచున్న యెడల కలహము కలుగును.

క. మూషకమును కరుచుక, సం
తోషంబున నెదురుపడిన । తోడనె శత్రుల్
శోషించి యోడిపోదురు,
శేషఫణీశ్వర శయాన । శిఖనరసింహా. 183

తా. ఓ పన్నగశయనా నరసింహస్వామీ! పిల్లి యెలుకను నోట, గఱచుకొని సంతోషముతో నెదురుగా వచ్చినచో శత్రువులు నశించి పోదురు.

క. జోరుపనులందు నడుమను
దూరిన నా పనులుజెడును । తోడనె నాయా
కార్యములు నిలుప వలయును
క్షీర సరిత్పతిశయాన; । శిఖనరసింహా. 184

తా. ఓ పాల్కడలి శయనా! నరసింహస్వామీ! తొందరగా పనులు చేయుచుండగా పిల్లి మధ్యలో చొరబడినచో ఆకార్యములుచెడును. కావున వెంటనే ఆపవలయును.

క. ఓతువు మైథునమును కన
చేతికి వచ్చెడుధనంబు । చేరదు స్త్రీపుం
జాతుల పిలుపులు వినఁబడ
చేతముచెడు పయన మొదవు । శిఖినరసింహా. 185

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి సంభోగించునపుడు చూచినచో ధన నష్టము. ఆడ పిల్లి మగపిల్లి వీట్ల పిలుపులువినబడిన యెడల మనః క్లేశము కలుగును. ప్రయాణము కలుగును.

క. మోఁరన్ గడిగిన బంధులు
కోరిక జనుదెంత్రు; మఱియు । గుక్కలభీతిన్
పేరెంబిడ నరిభీతియు
చేరున్ పయనంబునందు । శిఖినరసింహా. 186

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి తన మూతిని నీళ్లలో కడుగుకొను నెడల బంధువులు వత్తురు. కుక్కలను చూచి భయముచే పరుగెత్తి నచో శత్రుభయము ప్రయాణము నందుకలుగును.

క. ఎలుకలకు వెఱచి పాఱిన
కలుగుఁ విఘ్నములకడ్డు । కనిన నిసువులన్
బిలుచుక వచ్చిన విఘ్నము,
శిలశాసన మగుచునుండు । శిఖినరసింహా. 187

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి యెలుకలకు భయపడి పారిపోయి నచో విఘ్నమును హరించును. తన పిల్లలను తీసుకొని వచ్చిన యెడల విఘ్నములు కలుగును. ఇది నిశ్చయము.

క. శీలిత బయనం బగునపు
డాలయ పుంగు మ్మమందు । నటనెదురైనన్
వాలాయ మింటఁ జొరిఁగి న
చీలికి దోషంబులేదు । శిఖినరసింహా.

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణ సమయమునందు పెంపుడు పిల్లి గుమ్మము ముందర కనఁబడినచో దోషములేదు.

క. పిల్లల నోటం గఱుచుక
వెల్లిన స్థల చలనమగును! పిల్లికిభయమున్
మెల్లగ దాగుటగన విల
సిల్లును కార్య సఫలంబు ! శిఖినరసింహా. 189

తా. ఓ నరసింహస్వామీ! పిల్లి తన పిల్లలను నోట కరచుకొని పోవునెడలస్థాన భ్రష్టమగును. తనను చూచి భయపడిదాగుకొన్నచో కార్యము సిద్ధించును.

క. ఆరోగ్యము కక్కినచో
ప్రేరిమి మల మూత్రములను ! విడిచినరోగం
బారూఢి సంభవించును
క్షీర సరిత్పతిశయాన ! శిఖినరసింహా. 190

తా. ఓ పాల్కడలిశయనా! నరసింహస్వామీ! పిల్లి కక్కుట చూచినచో ఆరోగ్యము. మలమూత్రములను విడుచుట చూచినచో రోగము కలుగును.

—: కుక్కల శకునము :—

(ఈ శకునము 8 ప్రతులలో లేదు.)

క. కుక్కకుడికాల దన కుడి
ప్రక్కన్ యేయంగనైన ! బరుకుచు వెళ్లన్
గ్రక్కున గన పయనంబుల
చిక్కును లాభంబుజయము ! శిఖినరసింహా. 191

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణ సమయమునందు కుక్క కుడికాలితో తనకుడి వైపున యేయంగమునైన గాని బిరుకుచుపోయి నచో మిక్కిలి లాభము కలుగును.

క. మఱియు నమేధ్యం బైనను
బురదైననుఁ బూసికొని చె । వులు జాడించన్
ధరపయనంబులఁ జూచిన
స్థిరముగ మృత్యు భయమగును । శిఖనరసింహా. 192

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణ సమయమునందు కుక్క అమేధ్యమునుగాని బురదనుగాని పూసికొని చెవులు జాడించుచు, కన బడినచో మృత్యు భయము కలుగును.

క. గ్రామాధి పతింటి మొగన్
సీమముతో నుదయమందు । నిత్యము కుక్కల్
బౌమనుచు మొరగ బదిలై
సీమ న్నెడబాసిపోవు । శిఖనరసింహా. 193

తా. ఓ నరసింహస్వామీ! ప్రతిదినమును ఉదయ కాలమునందు కుక్కలు గ్రామాధికారి యింటివైపు మొగముపెట్టి అరచు చుండిన యెడల ఆత దుద్యోగము బదిలీయై ఆ దేశము వదలి పోవును.

క. గ్రామపు టాగ్నేయ దిశను
దీమసమున రెండు మూఁడు । దినముల్ భానున్
ఆముకొని చూచి మొరిగిన
సీమన్ జోరాగ్ని భయము । శిఖనరసింహా. 194

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు గ్రామమునకు అగ్నేయ దిక్కున సూర్యుని చూచుచు, రెండు మూఁడు దినములు మొరిగినచో చోరాగ్ని భయము కలుగును.

క. అలాగే మధ్యాహ్నము
వాలాయము మొరిగెనేని । పడుమృత్యువుచే
నాలాగ పరాహ్ణంబున,
శీలంబుగ మొరుగ కలఁత । శిఖనరసింహా. 195

తా. ఓ నరసింహస్వామీ ! అదే ప్రకారము మధ్యాహ్నము నందు మొరుగుచేని మృత్యుభయము. అపరాహ్ణ కాలమునందు మొరిగె నేని కలహము కలుగును. పై ఫలములు గ్రామమునకు చెల్లును.

క. సందెకడ నినుని కభిముఖ
మొందుచు శునకంబు లేడ్వ । నొనగూడును కా
పుందనములు బహు నష్టము
చెందెద రనయుంబు నిజము । శిఖనరసింహా. 196

తా. ఓ నరసింహస్వామీ ! కుక్కలు సాయంకాలము నందు సూర్యాభి ముఖములై లేడ్చినచో కాపులకు కీడుకలుగును.

క. సందెకడ నగ్నిదిశ, నా
క్రందనములు చేయుచున్న । గ్రామంబునకున్
తొందరగ దొంగ లొత్తురు
చిందను దర్శన ధురీణ । శిఖనరసింహా. 197

తా. ఓ నరసింహస్వామీ ! సాయంకాలము నందు కుక్కలు ఆగ్నేయ దిక్కును చూచుచు యేడ్చినచో ఆగ్రామమునకు కొలంది రోజులలో దొంగలు వత్తురు.

క. ఏ యింటి ముందు కుక్కలు
పాయక తలవంచి నేల । బఱుకుచు నేడ్వన్
ఆ యింటి బిడ్డలకు మృతి
చేయున్ తప్ప దిది, నిజంబు । శిఖనరసింహా. 198

తా. ఓ నరసింహస్వామీ ! కుక్కలు యింటి ముందు తల వంచి నేల బఱుకుచు నేడ్చినచో ఆ యింటి బిడ్డలకు మృత్యువు గలుగును.

క. ఏ వీథిలోనఁ గుక్కలు,
ఆ వని శోకింప నెన్ని ॥ దహములలోనన్
పోవును వీనుం గొక్కటి
సేవక సేవధి రమేశ ॥ శిఖనరసింహా. 199

తా. ఓ నరసింహస్వామీ ! కుక్కలు యే వీథిలోగాని "ఆవని" యేడ్చినచో; వారం రోజులలో ఆవీధియందొక మరణము జరుగును.

క. మిన్నుఁగని కుక్కలేడ్చిన,
వన్నుగ వర్షంబు, నింటి ॥ పై నేడ్చిన, లో
నున్న మనుజులకు భయమగు
చిన్నా బళగిరివిహార ॥ శిఖనరసింహా. 200

తా. ఓ అహోబళగిరి యందు విహరించే నరసింహస్వామీ ! కుక్కలు ఆకాశము చూచి యేడ్చినచో వర్షము కురియును. ఇంటిపై కెక్కి యేడ్చినచో ఆ యింటిలోని మనుష్యులకు భయము కలుగును.

క. గోపురము పైన నేడ్చినఁ
బాధించున గ్రామమందు ॥ బహురోగంబుల్
గోవృథివి యందు నేడ్చినఁ
శ్రీపతి పశుహాని యగును ॥ శిఖనరసింహా. 201

తా. ఓ లక్ష్మీనృసింహస్వామీ ! కుక్కలు గోపురము మీఁద నెక్కి యేడ్చినచో నాగ్రామమునందేక రోగములు కలుగును. పశువులు సంచరించు స్థలమునం దేడ్చినచో పశువులకు కీడుకలుగును.

క. మిద్దెల వాముల గూర్చొని
రద్దిగ నేడ్చినను వాన ॥ రయమున వచ్చున్
వద్దనుచు మొత్తుకున్నను
సిద్ధము వర్షంబు కురియ ॥ శిఖనరసింహా. 202

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు మిద్దెల మీఁదను వాముల మీఁదను కూర్చుండియేడ్చినచో ఎక్కువ వర్షము కురియును.

క. ఎద్దడినిఁ కుక్క లఱచుచు,
పెద్దగఁ గ్రుంకు లిడి తలలు । విదళించినచో,
వద్దుగ వానలు కురియును,
సిద్ధము పదిరెండో దినము । శిఖినరసింహా. 203

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు ఎద్దడిగానున్న కాలమందు అఱచుచు నీళ్లయందు మునిఁగి తలలు విదలించినచో వర్షము 12 దినములలో కురియును.

క. కాటి వరకూరి నుండియు,
పాటిగ శునకంబు లేడ్చి । పరుగెత్తినచో;
మేటయిన గొప్పమనిషికి
చేటగు మరణంబుఁ జెందు । శిఖినరసింహా. 204

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు గ్రామమునుండి యేడ్చుచు శ్మశానము వరకు పరుగెత్తెనేని గ్రామములో పెద్ద మనిషికి కీడు గలిగి మరణించును.

క. వాకిటపై తలమోపుచు
తోఁకను వీథికిని జూచి । తోడ్తోనేడ్వ
వీకమెయి నింటివారికి
చేకొనురోగములు, మిగుల । శిఖినరసింహా. 205

తా. ఓ నరసింహస్వామీ! కుక్క యింటి వాకిలిమీఁద తల మోపి తోఁక వీథిలోనికి చాచి వెంటవెంటనే యేడ్చినచో యింటి లోని వారికి రోగము కల్గును.

క. వ్రాలి తలఁగడపపై నిడి
వాలంబింట్లోకిఁజాచి । వాగిన నిలుయి
ల్లాలు రహస్థితి మిండల
శీలముకలదై చరించు । శిఖినరసింహా. 206

తా. ఓ నరసింహస్వామీ! కుక్క తనతలను గడపమీద బెట్టి తోకను యింటిలోనికి చాచి యేడ్చుచుండె నేని ఆయింటి యిల్లాలు చెడుగుణముగలదై యుండునని తెలియవచ్చును.

క. గోడను గోళ్లను కుక్కలు
తీడుచు పెకలించి యేడ్చి । తే దొంగలచే
గోడకు కన్నము బడి మఱి
చేడెల సొమ్ములు తొలంగు । శిఖినరసింహా. 207

తా. ఓ నరసింహస్వామీ! కుక్కలు గోళ్లతో గోడను గోకుచు పెకలించుచు యేడ్చినచో గోడకు కన్నము బడి స్త్రీల సొమ్ములు పోవును.

క. చాకుడు కుక్కొక కంటితొ
శోకించుచు కూడుదినక । సొరుగుచు నుండన్
లోకోత్తర గుణుఁడైనను
చేకొను శోకంబు మిగుల । శిఖినరసింహా. 208

తా. ఓ నరసింహస్వామీ! పెంపుడు కుక్క ఒక కంటితో నీరు గార్చుచు అన్నముతినక దుఃఖించు చున్న యెడల ఆయజమానిగొప్ప వాఁడైనను దుఃఖము పాలగును.

క. ఎడమటి మోకాల్ మూర్కొన
కడు ధనలాభంబు, కుడిని । కాంతల కలహాల్
కుడితొడ మూర్కొన శుభమగు
చెడు గెడమను కలహమగను । శిఖినరసింహా. 209

తా. ఓనరసింహస్వామీ! కుక్క ఎడమ మోకాలు మూచూచి నచో ధనలాభము కుడి మోకాలు మూచూచినచో స్త్రీ కలహము, కుడితొడను మూచూచినచో శుభము, ఎడమతొడను మూచూచి నచో కీడు కల్గును.

క. పయన మగువారి కాలిన్
కాయి కాయి యని మూర్కొనంగ । గొనసాగదు నా
పయనం బెవ్వారికి భువి
చెయిజారును చేతిదుడ్డు । శిఖనరసింహా. 210

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణమై వెళ్లు వారి కాలి కుక్క "కయికయి" అని యరచుచు మూర్కొనినచో; ఆ ప్రయాణము కొనసాగదు. చేతియందున్న ధనముపోవును.

క. ఊకారంబున మొఱిగిన
ప్రాకటముగ నర్థసిద్ధి । ప్రక్కను యెడమన్,
ఐకారంబున మేలగు
చేకొను "ఔవ"నఁగ తప్పు । శిఖనరసింహా. 211

తా. ఓ నరసింహస్వామీ! కుక్క "ఊ" అని యెడమ ప్రక్క యందు మొఱిఁగినచో ధనలాభము "ఐ" అని మొఱిఁగినను మేలే, "ఔ" అని మొఱిఁగినచో కీడు.

క. కాలికి నడ్డంబై తన
వాలము ద్రుద్దుచును వెనుక । వైపున మెఱుఁగన్
లీలగ సొమ్మును దొంగకు
శీలత చూపుటకు పిలుపు । శిఖనరసింహా. 212

తా. ఓ నరసింహస్వామీ! కుక్క కాలికి నడ్డముగా వచ్చితోఁక రుద్ధుచు వెనుక వైపున మొరుగు నెడల ధనము దొంగల పాలగును.

క. గట్టిగ నేడ్చుచు కూంతలు
బెట్టుచు పరుగెత్తదాని। వెంటనె జనినన్,
తట్టున హేతువు తెలుసును
చిట్టా బళగిరివిహార। శిఖినరసింహా. 213

తా. ఓ అహోబలగిరి యందు విహరించే నరసింహస్వామీ! కుక్క గట్టిగ నేడ్చుచు కూయుచు పరుగెత్తుచున్నచో దాని వెంటనే వెళ్లినచో కారణము తెలియును.

క. పరుపున బడుకొని యేడ్చిన
ఒరువు పయిన్ బండు వారు। వ్యాధిగ్రస్తుల్
చిఱుతలకు పాలు గుడిపిన
స్థిరముగ సంసారవృద్ధి। శిఖినరసింహా. 214

తా. ఓ నరసింహస్వామీ! కుక్క పరుపుమీద పండుకొని యేడ్చినచో ఆపరుపుమీద పరుండు వారికిరోగము వచ్చును. తన పిల్లలకు పాలు యిచ్చినచో సంసారవృద్ధియగును.

క. శ్వాన సురతంబుఁ గనుఁగొన
మానుగ మరునాఁడు పయన। మగుమనుటసుమీ!
ఆనాఁడ పయన మాపుము
శ్రీనిలయా! తెలియవలయు। శిఖినరసింహా. 215

తా. ఓ లక్ష్మీకరమైన నరసింహస్వామీ! ప్రయాణసమయమున కుక్కలు సురతమును చూచిన యెడల ఆనాఁడు ప్రయాణమాపి, మరుదినంబున పోవలయును.

క. లాంగూల హీనశునకము
నుంగన కీడగును నలువు। నుంగను కుక్కన్
చెంగట గన పని సఫలము
చెంగించును కుంటికుక్క। శిఖినరసింహా. 216

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణసమయమందు తోకలేని కుక్కను చూచిన కీడు, నల్లకుక్కను చూచిన శుభము. కుంటి కుక్కను చూచిన అపజయము కలుగును.

—: నక్కలశకునము :—

(నక్కల శకునము 3 ప్రతులలోను లేదు)

క. నక్కను శునకము కఱచుట,
గ్రక్కునఁ జూచినను శుభము । కలుగును, నక్కల్
చక్కఁగఁ గూయుటఁ జూచిన
చిక్కును క్షేమంబు ధనము । శిఖినరసింహా. 217

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణసమయమున నక్కను కుక్క కఱచుచుండఁగా చూచిన యెడల శుభము. నక్కలు కూయుచున్న యెడల ధనలాభము క్షేమము గలుగును.

క. వాటమగు కాటి కొరవిని
నోటం గఱచుకొని యెదుట । నుంగనపడినన్
గాటమగు దుఃఖ మశుభము
చేటును కలిగించునండ్రు । శిఖినరసింహా. 218

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణసమయమున నక్క కాటిలోని కొరకంచు నోటకఱచుకొని యెదురుగా గనఁబడినచో దుఃఖము కలుగును.

క. ఘోటకముల మఱిపశువుల
కూటు వలాజంబుకముల । కూతలువినుచున్
దాటి మల మూత్రములనిడ
చేటుగలుగు వానికెపుడు । శిఖినరశింహా. 219

తా. ఓ నరసింహస్వామీ! గుఱ్ఱములుగాని ఆవులుగాని నక్కల కూతలువిని గంతులువైచి మలమూత్రములను విడిచినచో వానికి కీడుకలుగును.

క. "హూంహూం! టాటా!" యనురవ
హాహా శ్రేయంబుశిశిర । మందున, సత్యం
"బోహో! యీహీ!" యనినను
శ్రీహృద్వల్లభ వివత్తు । శిఖనరసింహా. 220

తా. ఓ లక్ష్మీమనోవల్లభా! నరసింహస్వామీ! నక్కలు శిశిర ఋతువునందు "హూంహూం! టాటా! హాహా" యని కూయునెడల శ్రేయస్సుకలుగును. "ఓహో! ఈహీ!" అని కూయునెడల కీడుకలుగును.

క. "టట్టా" యని కూసినచో,
పట్టుక పథికులను జంప । వ్యాఘ్రాదులకున్
గట్టి పిలుపంచుఁ దెలుపుట
చిట్టాబళగిరివిహార । శిఖనరసింహా. 221

తా. ఓ అహోబలగిరి యందు విహరించే నరసింహస్వామీ! ప్రయాణసమయమై పోవువారికి, "టట్టా" అని కూయు నక్కకూత వినబడినచో, తాను వ్యాఘ్రాది దుష్టమృగముల బాధకు, లోనగుదు నని గ్రహించవలెను.

క. "క్లోళ్లో! క్లీళ్లో! క్లూళ్లో!
నాళ్లో! లోళ్లో!" యటంచు । నక్కలుకూయన్
పాళెములు కాలిపోవును
శ్రీలలనా హృద్విహార । శిఖనరసింహా. 222

తా. ఓ లక్ష్మీ మనోవిహార నరసింహస్వామీ! నక్కలు "క్లోళ్లో! క్లీళ్లో! క్లూళ్లో! నాళ్లో! లోళ్లో!" అని కూసినచో గ్రామములకు అగ్నిభయము కలుగును.

## —: గరుత్మంతునిశకునము :—

(ఈ గరుత్మంతుని శకునమునకు ముందు పాలపక్షిశకునము కొన్ని. ప్రతులలో గలదు.)

క. కట్టిన బహుకష్టములగుఁ
జుట్టిన శుభఫలములబ్బు । నూటిగఁదీర్చన్
పెట్టిన బంగరు పంటగుఁ
చిట్టాబళగిరి విహార । శిఖనరసింహా. 223

విశేషాంశములు = కట్టుట అనఁగా = ఎడమనుండి కుడివైపునకు పోవుట, చుట్టుట అనఁగా = ప్రదక్షిణముగా తిరుగుట, తీర్చుట అనఁగా=కుడినుండి యెడమవైపునకు పోవుట.

తా. ఓనరసింహస్వామీ ! గరుత్మంతుఁడు ప్రయాణసమయము లందు కట్టినచో కష్టములు కలుగును. చుట్టినచో శుభముకలుగును. తీర్చినచో ధనలాభము కలుగును.

క. కామించి మేతఁ గఱచుక
† స్వామీ! కృష్ణాయటన్న । సకలంబునకున్
శ్రీమంతమైన శుభమగు,
‡ క్షేమంబున క్షేమకారి । శిఖనరసింహా. 224

తా. ఓ నరసింహస్వామీ! గరుత్మంతుఁడు మేతను నోటిలో పెట్టుకొని "కృష్ణా!" అని అరచినచో సకల శుభములు కలిగి విశేష సౌఖ్యములు కలుగును.

క. ఏదిక్కునకుందవిలిన
♦ నాదిక్కున శుభఫలంబు । లందును సిరులం
దే దిక్కుఁగనుఁగొనినను
శ్రీదయితా! శుభములబ్బు । శిఖనరసింహా. 225

† స్వామిని పేర్కొనిన తీర్పు అని 3 ప్రాత ప్రతులలో గలదు. ‡ శ్రీమానిని హృద్విహార,శి: అని వావిళ్లవారిదానిలో గలదు.

♦ నాదిక్కున చరణమిలను బంధము సిరులం- అని 2 ప్రతులలో యున్నది.

తా. ఓ లక్ష్మీనృసింహస్వామీ! ఏవైపున గరుత్మంతుఁడు తనకు కనబడునో ఆదిక్కునందు శుభములు కలుగును. సంపదలు సిద్ధించును.

క. నల్లయు పాలయు గరుడుఁడు
నల్లలితము నక్కకుక్క । సరినిరుగడలం
దెల్లమును వెనుకఁగనుఁగొనఁ
జెల్లును త్రైలోక్యపదవి । శిఖినరసింహా. 226

తా. ఓ నరసింహస్వామీ! నల్లయు, పాలపిట్టయు గరుత్మంతుడు, కుక్క, నక్క ఇవి రెండువైపుల వెనుకనుండినచో గొప్ప పదవి లభించును.

క. ధారుణి పాలయు గరుడుఁడు
కోరిక కుడినుండి యెడమ । కుం బోయినచో
తీరుపు కుడికిన్ బోయిన
శ్రీరామా కట్టుటంద్రు । శిఖినరసింహా. 227

తా. ఓ నరసింహస్వామీ ! పాలపిట్టయు గరుడపక్షియు కుడి నుండి యెడమవైపునకు పోయినచో తీర్చుటని యర్థము. ఎడమనుండి కుడివైపునకు పోయినచో కట్టుటని యర్థము.

క. కొండలకు దీర్పుశుభమగు
కొండలకున్ గట్టు శుభము । ♦ గూర్చును మఱియున్
కొండలకు దర్శనంబే
చెందించును శుభఫలంబు । శిఖినరసింహా. 228

తా. ఓ నరసింహస్వామీ ! కొండలకు తీర్చుటయు మఱికొండలకు కట్టుటయు మఱికొండలకు దర్శనమును శుభములు కలిగించును.

---

† దల్లముగ వెనుక నుండిన. అని వావిళ్లవారి ప్రతిలోనున్నది.

సూచన:—227, 228, 229, 230. నంబర్లు గల పద్యములు 3 ప్రతులలోను లేవు.

♦ గలిగించు మఱిన్ అనియున్నది. యతి తప్పుటచే సవరించితిని.

క. నరులకు ప్రత్యుదయము ని
ద్దుర మేల్కొని కనులు దెరువఁ । దోడ్తోఁ గరుడుం
డుర వడి దర్శన మిచ్చిన
చిర శుభ మాయువు జయంబు । శిఖినరసింహా. 229

తా. ఓ నరసింహస్వామీ! మనుష్యులకు ప్రతినిత్యము ఉదయకాలమునందు నిద్రమేల్కొని చూచుటతోఁడనే గరుడుఁడు కనబడినచోఁ; శుభజయము, ఆయువు, జయము, కలుగును.

క. నీరా కరముల చెంగట
గారుడ శకునంబు ఫలము । గాదెవ్వేళన్
నీరాభావంబగు దిశ
శ్రీరమణా! కలుగు శుభము । శిఖినరసింహా. 230

తా. ఓ నరసింహస్వామీ! గరుడుని శకునము నీటిపట్టులందు ఫలముగాదు. నీళ్లులేని తావులందు శుభము కలుగును.

## —: పాలపిట్ట శకునము :—

(ఇది మూడుప్రతులలోఁ గరుడు శకునమునకు ముందున్నది)

*క. పప్పన్నము పైమాటయు
తప్పక పదిలాభ మొదవు । ధరమనుజులకున్
యొప్పైన పాలశకునము
చెప్పఁగ వలెనా! ఫలంబు । శిఖినరసింహా. 231

తా. ఓ నరసింహస్వామీ! ప్రయాణసమయమునందు పాలపిట్ట కనబడినచోఁ మృష్టాన్న భోజనము కలుగును.

---

* ఈ పద్యము 3 ప్రతులలోను లేదు.

క. సురపతిపై బహుచేటగు,
నరయఁగ నయ్యగ్నియందు నతికష్టమగున్,
ధర సామ్రాజ్యము శుభములు,
సిరులలరును, యమునిమీఁద శిఖినరసింహా. 232

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట తూర్పునఁ గనబడినచో చెఱుపు. అగ్నేయదిశఁ గనబడినచో మిక్కిలి కష్టము. దక్షిణదిశయందు కనబడినచో రాజ్యసుఖము కలుగును.

క. నైరృతిని వాహనంబగు,
కోరిన లక్ష్మీకరంబ గున్ వరుణునిపై,
చారుతర కీర్తి శుభములు,
చేరును వాయవ్యమూల శిఖినరసింహా. 233

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట నైరృతిదిశను, కనబడినచో వాహనములు. పచ్చిమదిశను కనబడినచో సంపద సత్కీర్తి. వాయవ్యదిశను కనబడిచో గొప్పకీర్తి శుభములు కలుగును.

క. ధన పతిపై మరణంబగు,
ఘనమగు నీశాన్యమూలఁ గడుదుఃఖమగున్,
కనుపాల పక్షిశకునము,
చినదోబళగిరి విహార శిఖినరసింహా. 234

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట ఉత్తరవు దిక్కునందు కనబడినచో మరణము. ఈశాన్యదిక్కునందు కనబడిచో మిక్కిలి కష్టము లగును.

క. వలవలనుండిన నెమ్మది,
వలవల నుండెడమజనిన వలనగు శుభముల్
నెలనఘమనుఁ గనలాభము,
చెలు వెడలును కుడిని జనిన శిఖినరసింహా. 235

తా. ఓ నరసింహస్వామీ! పాలపిట్ట కుడివైపున నుండినచో మంచిది. కుడినుండి యెడమకుఁ బోయినచో శుభము. నెల నడుమను చూచిన లాభము. ఎడమనుండి కుడివైపునకుఁ బోయిన కీడు కలుగును.

క. తన ముంగలఁ గనలాభము,
తన వెనుకనుఁ గనినకీడు । తప్పదు జనులను,
ఘన పాలశకున మందురు,
చినయోబళగిరివిహార । శిఖనరసింహా. 236

తా. ఓ చినయోబళగిరియందు విహరించే నరసింహస్వామీ! పాలపిట్టను తనముందు చూచిన లాభము. తనవెనుకను చూచిన కీడు కలుగును.

—: * కా కు ల శ కు న ము :—

క. ఒక్కటి దీర్చిన నిర్భయ,
మక్కట శుభఫలము రెండు । నటతీర్పంగన్,
నిక్కముగ మూఁడు దీర్చినఁ
జిక్కును నొకరాజ్యలక్ష్మి । శిఖనరసింహా. 237

తా. ఓ నరసింహస్వామీ! ఒక కాకి తీర్చినయెడల నిర్భయము. రెండు తీర్చినచో శుభము. మూఁడు తీర్చినచో రాజ్యలాభము, కలుగును.

క. తీరిచి కట్టిన మరణము,
తీలక మున్గట్టెనేని । దీనతఁ గను, వి
స్తారము కట్టినఁ దీర్చినఁ
శ్రీరమణా! కార్యసిద్ధి । శిఖనరసింహా. 238

* ఇది వ్రాతప్రతులలో భారద్వాజమునకు వెనుక గలదు.

తా. ఓ లక్ష్మీరమణా! నరసింహస్వామీ! కాకి తీర్చి కట్టినచో మరణము. తీర్చకయే కట్టినచో దైన్యము. పలుసారులు కట్టి తీర్చినచో కార్యసిద్ధి కలుగును.

క. మేఁతయు గట్టియుఁ గఱచుక,
ప్రీతిగ వాయసము తీర్పఁ । బెనులాభముసే
నా తీర్చి యొకటి కట్టిన
స్ఫీతంబగు శుభము గలుగు । శిఖనరసింహా. 239

తా. ఓ నరసింహస్వామీ? కాకి మేఁతయు కట్టియు ముక్కుతో కఱచుక తీర్చినయెడల మిక్కిలి లాభము. ఎక్కువ కాకులు తీర్చి ఒకటిమాత్రము కట్టినచో శుభము కలుగును.

క. దండిగ సరిగా జోడై,
రెండున్ మూఁడయినఁ దీర్పు । లేవడియగుచున్.
ఖండితముగఁ జెడుఁ గార్యము
‡ చెండున్ తలమీఁదిపనియు । శిఖనరసింహా. 240

తా. ఓ నరసింహస్వామీ! రెండుకాకులు రెండు మూఁడు పర్యాయములుతీర్చినచో దారిద్ర్యము. ఎటువంటి అనుకూలముగానున్న పనియైనను పాడగును.

క. వెనుకను ముందై తీర్చిన
పని లక్ష్మీకరము నగుచు । భాసిల్లును గ
ట్టినఁ గత్తిమీఁది సాముగు
చినయో బళగిరి విహార । శిఖనరసింహా. 241

‡ 1 రెండు తల మీఁద పడిన 4 చెండున్ తలమీఁద పడిన. అని పాఠ్ర ప్రతులలోకలదు, మొదటిది యతిభంగము. లేవడి=దరిద్రము.

తా. ఓ అహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ ! కాకి వెనుకనుండి ముందుకువచ్చి తీర్చినచో కార్యము జయముగా కల్గును. కట్టినచో కార్యము కత్తిమీఁది సామువలె అనుకూలమగుట కష్టము.

క. కోరిన యెడ బహు దూరము
నారయ నున్నతపు తీర్పు ॥ లాలస్యమగున్
‡ చేరువ నేనుఁగు పొడవున
శ్రీరమణా ! తీర్పుమేలు ॥ శిఖనరసింహా. 242

తా. ఓ నరసింహస్వామీ ! కాకి దూరముగానుండి తీర్చినేని కార్య మాలస్యముగా అగును. సమీపముననుండి యెదురుగా యేనుఁగుపొడవున తీర్చినచో మేలుకలుగును.

క. వెనుదిక్కునుండి ముంగల
కును బోయిన శుభము లెదురు ॥ కొనివచ్చిన పూ
నిన పని తడ గట్టినగతి,
చినయో బళగిరి విహార ॥ శిఖనరసింహా. 243

తా. ఓ అహోబలగిరియందు విహరించే నరసింహస్వామీ ! కాకి వెనుకనుండి ముందునకు పోయినచో మేలు. ఎదురుగ వచ్చిన యెడల చెడును.

క. ఊరును నిల్లును వెడలఁగ
భోరునఁ దీర్చునను మేలు ॥ భువిపైనము దాఁ
జేరు నిలునూరి ముందర
శ్రీరమణా ! కట్టమేలు ॥ శిఖనరసింహా. 244

తా. ఓలక్ష్మీనరసింహా! ఊరినుండిగాని యింటినుండిగాని బయలు వెడలు నప్పుడు కాకులు గుంపుగా తీర్చినచో మేలు, ఊరిముందుగాని యింటిముందుగాని చేరునప్పుడు కట్టినచో మేలు కలుగును.

‡ చేరున నెదురగఁబొడవున పాఠాంతరము.

క. వాయస శకునంబెంచిన
బాయక గడుమార్గమందు । బనిలేదనుమీ!
యేయెడ నిలువురిముంగల
శ్రీయలరు శుభాశుభములు । శిఖినరసింహా. 245

తా. ఓ నరసింహస్వామీ! కాకియొక్క శకునము గూర్చి త్రోవయందు విచారింప నక్కఱలేదు. ఊరిముందరను ఇంటిముందరను మాత్రమే పరీక్షింప వలయును.

క. వాయసమైథునమును గనఁ
♦ జేయున్ పదినెలలలోనఁ । జేటును మరణం
బేయెడలనైన నరులకుఁ
జేయుగన శాంతి జపము । శిఖినరసింహా. 246

తా. ఓ నరసింహస్వామీ! కాకులమైథునమును చూచినచో 10 నెలలలో కీడు, మరణము కలుగును. కనుక తద్దోషపరిహారార్థము శాంతి జపము చేయవలెను.

† (విశేషాంశము=కాకులమైథునము చూచినచో ఆతఁడు చనిపోయినాఁడని అత్తవారికి వార్తబంపినచో వారు యేడ్చుచు యీతని యింటికి వచ్చినచో దోషముపోవునని పెద్దలు చెప్పుదురు.)

క. కాకి తన తలను తన్నిన
‡ ప్రాకటముగ గార్యహాని । భయ మశుభంబున్
కాకులు గూళ్లను గట్టిన
చేకొని వఱపోను నిజము । శిఖినరసింహా. 247

తా. ఓ నరసింహస్వామీ! కాకి కాళ్లతో తన తలను తన్నిన యెడల కార్యహాని. కాకులు గూళ్లుకట్టుకొన్నచో వర్షములుకురియవు.

♦ † ‡ 246, 247 పద్యములు 3 ప్రతులలో లేవు. వావిళ్ల వారి దానిలో కలవు.

—: ♦ భారద్వాజశకునము :—

క. † మిక్కిలి నడ్డము వడినను
నిక్కవు ఫలమబ్బు పోతు । నిజముగఁదీర్ప
నెక్కువ కష్టము నొందియుఁ
జిక్కులఁబడు మానవుండు । శిఖనరసింహా. 248

తా. ఓ నరసింహాస్వామీ! భరద్వాజపక్షి అడ్డముగా నడచినచో మేలు, పోతుపిట్ట తీర్చిన యెడల కష్టము కలుగును.

క. నాతియు దీర్చిన శుభమగు
నాతియు మటిపోతుకూడి । నయముగఁదీర్పన్,
ఖ్యాతిగ జయశుభలాభము
శ్రీతరుణీ హృద్విహార । శిఖనరసింహా. 249

తా. ఓ లక్ష్మీనాథా! నరసింహాస్వామీ! ఆడపక్షి తీర్చినచో మేలు. అడపక్షి మగపక్షియు కలిసి తీర్చినచో జయము, శుభము, కలుగును.

క. ధరలో భారద్వాజము
కర మరుదుగఁ బసలపోతు । గాడందురయా
సిరులలరు పక్షిశకునము
సిరిగల సౌఖ్యంబు లలరు । శిఖనరసింహా. 250

తా. ఓ నరసింహాస్వామీ! భారద్వాజపక్షిని "పసలపోఁతు పసల పోలుఁగాడు" అని చెప్పుదురు. ఇది సిరిగల పక్షికావున దీని శకునము సౌఖ్యము.

---

♦ ఇది 8 ప్రతులలో కాకిశకునమునకు ముందే గలదు.

† మిక్కిలి నడ్డగ పరువిడ పాఠాంతరము.

విశేషాంశములు:—ఇది నల్లగానుండును. పశువులమీద కూర్చుండును. దీనిని ఏట్రింతపిట్టందురు.

—: కబ్బపులుగు లేక నరస్వతిపులుగు శకునము :—

క. వాలాయము కబ్బపులుగు
నాలుగు జాములకుఁబల్కు । నయముగ ఫలముల్
మేలగు నెనిమిది దిక్కుల
శ్రీలోలా! చూడవలయు । శిఖనరసింహా. 251

తా. ఓ నరసింహాస్వామీ! కబ్బపులుగు నాలుగు జాములలో ఎనిమిది దిక్కులందు పలుకు ఫలములను చూడవలయును.

క. మరణముఁ, జేటుఁ, బ్రియఁబును,
కర మరుదుగ వానభయము, । కలుగును శుభమున్
గరకరి తొలిజామున, సు
స్థిరమతి దిక్కరులఫలము । శిఖనరసింహా. 252

క † వాన, సిరిహెచ్చు, ఫల, మను
మానము, భూపతులశోక । మరి, రాడ్భయఃమున్
శోణిత దర్శ భీతియు,
‡ శ్రీనుత యామద్వయమున । శిఖనరసింహా. 253

క. భయమున్, కలహము, వానయు,
దయగల చుట్టాలరాక, । ధనమున్, శుభమున్,
ప్రియమగు, లాభములుల్లా
సి యగున్, యామత్రయంబు । శిఖనరసింహా. 254

† వాన సపితత్సుఫలనుమ, వాన సరిహెచ్చు ఫలనుమ, అని 1-4 ప్రతులలో నున్నది. ‡ శ్రీమత అని 4వ ప్రతిలోనున్నది.

క. భోజన, మగ్ని భయంబును,
నాజియు, పగవారిచేటు, । నతివృష్టి, మహా
తేజము, నష్టము, కష్టము,
శ్రీజయ నలుజాము ఫలము । శిఖినరసింహా. 255

సూ:—పై నాలుగు పద్యములలో నాలుగు జాముల యందు ఎనిమిది దిక్కులకు ఫలములు చెప్పబడినవి. వాని నీక్రింది చక్రమున వ్రాసియున్నాను.

—: జాముల దిశా ఫలములు :—

| జాములు, దిక్కు. | 1వ జాము, | 2వ జాము. | 3వ జాము. | 4వ జాము. |
|---|---|---|---|---|
| తూర్పు | మరణము | వర్షము | భయము | భోజనము |
| ఆగ్నేయము | కష్టము | సంపదయు | కలహము | అగ్నిభయము |
| దక్షిణము | ప్రియము | అతిశయము | వాన | యుద్ధము |
| నైరుతి | వర్షము | కార్యసాఫల్యము | బంధువులరాక | శత్రువులచేటు |
| పడమర | భయము | అనుమానము | ధనము | అతివృష్టి |
| వాయువ్యము | శుభము | రాజశోకము | శుభము | మహాతేజము |
| ఉత్తరము | సంతోషము | శత్రుభయము | ప్రయము | నష్టము |
| ఈశాన్యము | మంచిబుద్ధి | రక్తదర్శనము | సంతోషము | కష్టము |

క. తన యిల్లును, తనయూరును,
తన తల్లియు, నెఱుఁగనపుడు । తగకూడిఁబల్కన్
ధనలాభము, శుభ ఫలమగు
చినరౌా బళిగిరివిహార । శిఖినరసింహా. 256

తా. ఓ నరసింహస్వామీ! తనయింటిలోఁగాని; తనయూరులోగాని యుండనప్పుడు తనతల్లి యెఱుఁగ కుండినపుడు కుడిప్రక్కను కబ్బవులుగు కూసిన ధనలాభము శుభము కలుగును.

—: అవయవముల అదురుపాటు :—

ఈభాగము 3 ప్రతులలోను తొండ పాటు తరువాత నున్నది.

క. కుడిదిక్కు నదర శాంతం
బెడమ కణత మధ్యమందు । నెడనడు నెత్తిన్
గనుగొను మృష్టాన్నంబును,
చెడు కుడిచెంపదరెనేని । శిఖినరసింహా. 257

తా. ఓ నరసింహస్వామీ! కుడిదిక్కునం దదరునెడ శాంతి, ఎడమ కణతయందు నడినెత్తియందు నదిరినచో మృష్టాన్నభోజనము. కుడి చెంప అదిరినచో చేటు కలుగును.

క. రాజికము నెడమ చెంపను
రాజియగున్ నొసల కుడిచె । † వాభణంబుల్
రాజభయ మెడమ చెవియును
శ్రీజయ నిశ్చయము లివియ । శిఖినరసింహా. 258

తా. ఓ నరసింహస్వామీ! ఎడముచెంప అదరునేని రాచకార్యములు తటస్థించును. నొసలు అదరునేని రాచకార్యములు రాజీయగును. కుడిచెవి యైనచో ఆభరణప్రాప్తి. ఎడమచెవి యైనచో జయము కలుగును.

క. ‡ కనుకుడి కొన దిగువ, వలన
యనము పయిన్నదరకీడు, । నటుకొనదిగువన్
గనుకీడుపైన మొదలెం
చిన మేలగు నెడమకన్ను । శిఖినరసింహా. 259

తా. ఓ నరసింహస్వామీ! కుడికన్ను కొన యందు దిగువను కన్నుపై నదిరినచో కీడు. మొదట నదిరినచో పైనము కలుగును.

† యతిభంగము.

‡ కను కుడి కొనకుం దిగవన పాఠాంతరము.

క. కానవ రక్తము గందురు
నాసిక యదరంగ రెండు । నయనములదరన్
వాసి నమాఖ్యయు జగడము
చేసును పైపెదవి యదర । శిఖనరసింహా. 260

తా. ఓ నరసింహస్వామీ! ముక్కదరునేని రక్తమును చూతురు. రెండు కండ్లదరునేని ప్రఖ్యాతిగలుగును. పైపెదవి యదరినచో కలహము కలుగును.

క. అడుగు పెదవి మృష్టాన్నము
కడులాభము గడ్డమదరఁ । గా, ధనమబ్బున్
కుడిచెక్కి లెడమచెక్కిలి
చెడు చోరభయంబు లంద్రు । శిఖనరసింహా. 261

తా. ఓ నరసింహస్వామీ! క్రిందిపెదవియదరినచో మృష్టాన్నము. గడ్డమైనచో మిక్కిలిలాభము. కుడిచెక్కిలియైనచో ధనలాభము. ఎడమచెక్కిలియైనచో చోరభయము కలుగును.

క. ‡ కుడి భుజమింతుల కౌగిలి
యెడమ భుజంబదర కీడు । నిలపుత్రులకుఁ
గుడిప్రక్క నెడమ ప్రక్కన
చెడు నగ్నిభయంబు లంద్రు । శిఖనరసింహా. 262

తా. ఓ నరసింహస్వామీ! కుడిభుజ మదరినచో స్త్రీలాభము. ఎడమ భుజమదరినచో పుత్రులకు కీడు. కుడి ప్రక్క యెడమప్రక్కయదరినచో అగ్నిభయము కలుగును.

‡ కుడిభుజ మింతులకగు శుభము. పాఠాంతరము ఇదే నిశ్చయించుకొన్నచో స్త్రీలకే వర్తించును.

క. ఉరమున్, జేతులు, మీఁజెయి
యఱచెయి వాహనము ధనము, । నఱచెయి సుతులున్
వరయూరు, నెడమ తొడయును,
† సిరిఁబడయును రాజభయము । శిఖనరసింహా. 263

తా. ఓ నరసింహస్వామీ! ఉరము, చేతులు, మీఁజేయి అఱచేయి అదరునెడల వాహనప్రాప్తి ధనప్రాప్తి. అఱచేయి మాత్ర మదరినచో పుత్రప్రాప్తి, కుడితొడ యదరినచో సంపదలు, ఎడమ తొడ యదరినచో రాజ భయము కలుగును.

క. మోకాళ్ళ నడుమ జాడ్యము,
గ్రైకొను నాభరణమొట్టి । కాళ్ళదరినచో,
పై కాళ్ల ధాన్య లాభము,
చేకొను నరికాళ్ళ శుభము । శిఖనరసింహా. 264

తా. ఓ నరసింహస్వామీ! మోకాళ్ళదరినచో రోగము. కాళ్ళ మాత్రమదిరినచో ఆభరణప్రాప్తి. పై కాళ్ళదరినచో ధాన్యలాభము. అరికాళ్ళదరినచో శుభము కలుగును.

—:వైద్య విషయ శకునములు:—

క. ఏయెడవైద్యుని బిలువగ,
పోయెడు వారలకు మంచి । పొలుపగుశకునం,
బాయత గతిఁగలిగినచో,
శ్రీయుత యారోగ్యమబ్బు । శిఖనరసింహా. 265

† శిరమునఁ బరరాజ భయము. 4 పాఠాంతరము ఇది సమంజసము కాదు.

నోటు:—1, 2, 4, ప్రతులలో ఈ పద్యము తరువాత పద్యములు లేవు. కాని ౧ స్వరలక్షణము ౨ గౌరీపంచాంగము ౩ తుమ్ములక్షణము. ౪ ప్రయాణ దినము లకు వారశూలలు ౫ కరిదినములు ౬ రాహుకాలము, ౭ వజ్రయోగములు ఉన్నవి. 2 కెంబరుబుక్కులో ౬–౭ విషయములులేవు.

బ్రహ్మశ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రులువారు ముద్రించిన ప్రతిలో పైవిషయములులేవు. కానియితరశకునములు 39 పద్యములలో చెప్పబడెను.

తా. ఓ నరసింహస్వామీ! వైద్యుని పిలుచుకొని వచ్చుటకు వెళ్లువారికి మంచి శకునము కలిగినచో రోగికి ఆరోగ్యము కలుగును.

క. రోగి కడ కేగు వైద్యున
కోగుగ దుష్టమగు శకున । మొనఁగూడినచో,
బాగు కలుగ దిలరోగికి,
శ్రీగరుడ విహంగవాహ । శిఖనరసింహా. 266

తా. ఓ గరుడవాహనా! నరసింహస్వామీ! రోగిని చూచుటకు వైద్యుఁడు వెళ్లునపుడు; ఆతనికి చెడ్డశకునమయినచో రోగికి బాగు కలుగదు.

క. శునకములు రోగి వాకిట,
గొనకొని నఖములను నేల । గోకుచుఁ దుడువఁ
చనురోగి యముని గీముకు,
చినయో బళగిరి విహార । శిఖనరసింహా. 267

తా. ఓ అహోబలగిరి యందు విహరించే నరసింహస్వామీ! కుక్కలు రోగివాకిట గోళ్ళతో భూమిని గోకుచు తుడుచు చున్నచో ఆరోగి త్వరలో చనిపోవును.

క. ఔషధము సేయునప్పుడు
* తోషము మది లేక చెడినఁ । తోడనెవైద్యుం
‡ డాసించక నారోగిని,
శేషశయన విడువవలయు । శిఖనరసింహా. 268

తా. ఓ శేషశయనా! నరసింహస్వామీ! వైద్యుఁడు రోగినిమిత్తము మందును సిద్ధము చేయునప్పుడు తన మనస్సులో సంతోషము లేక విచారము కల్గినచో నారోగము కుదరదు. కావున అట్టి రోగిని విడువవలయును.

---

విశే.—* తోషము=సంతోషము. తత్సమ శబ్దము. ‡ ప్రాస సమ్మతముకాదు.

క. వేఁకటియగు సతి, పతికిల
సోఁకఁగ తగదెట్టి వ్యాధి । సోకిన, నిడివై
ప్రాఁకఁగ తగదది యాపద
చేకొని మృతిఁగలుఁగఁ । జేయు శిఖనరసింహా. 269

తా. ఓ నరసింహస్వామీ! గర్భిణీస్త్రీ తన భర్త రోగిగానున్నప్పుడు వానిని తాఁకరాదు. అట్లు తాఁకినచో భర్తకు మరణము కలుగును.

క. నరులకు బలమగు రోగము
త్వరితంబుగఁ గుదిరెనేని । వడిగన్ మరలన్
దారకొని చేటొన గూర్చును
చిరకాలముకైన మఱల । శిఖనరసింహా. 270

తా. ఓ నరసింహస్వామీ!మనుష్యులకు బలమగు రోగము ఔషధముపుచ్చుకొన్న వెంటనే కుదిరినచో మఱల ఆరోగమే వానికి త్వరలో వచ్చి కీడుచేయును.

క. రోగి తనయుండు భార్యయు
నోగుగ నేప్రొద్దు కలత । లొందుచు నున్నన్
రోగము కుదురదు చంపును
శ్రీగౌరీశనుతపాద । శిఖనరసింహా. 271

తా. ఓ గౌరీనాథునిచే నుతింపఁబడిన పదములు గల నరసింహస్వామీ! రోగియు వానిభార్యయు పుత్రుఁడును నిత్యము జగడమాడుచుండినచో; ఆరోగము కుదురదు.

క. ఈరోగి యింక బ్రతుకఁడు
మారక మే; కలుగుననుచు । మరిమరి జనముల్
పౌరులు వాదుక చేసినఁ
జేరును యమసదనమునకు । శిఖనరసింహా. 272

తా. ఓ నరసింహస్వామీ! ఈరోగి యిఁక బ్రతుకడని జనులు చెప్పుకొనినచో ఆరోగి బ్రతుకడు.

క. వైద్యునిపై విశ్వాసము,
వైద్యుం డిడునట్టిమందు ॥ పై విశ్వాసం
బద్యతనంబుగ కలిగిన
♦ సిద్ధంబారోగ్య ఫలము ॥ శిఖనరసింహా. 273

తా. ఓ నరసింహస్వామీ! వైద్యుని యందును, అతఁడిచ్చు మందు నందును విశ్వాసము కలిగినచో ఆరోగ్యము కలుగును.

క. చీటికి మాటికి వైద్యుని,
పాటింపక బిలుచునట్టి ॥ వ్యాధిగ్రస్తుల్
చేటొందుట సిద్ధంబిల
చేటుఁ బడయుంగవచ్చు ॥ శిఖనరసింహా. 274

తా. ఓ నరసింహస్వామీ! వైద్యుని పదేపదే పిలిచినచో ఆరోగ్యము కలుగనేరదు.

క. భీషణముగ వైద్యునిపై
రోషావేశమునరోగి ॥ రూక్షోక్తులచే
దూషించి పల్కుచుండిన
శేషశయన! రోగిచచ్చు ॥ శిఖనరసింహా. 275

తా. ఓ శేషశయనా! నరసింహస్వామీ! రోగివైద్యునిపై రోషముతో కఠినముగా దూషించుచుండినచో మరణించును.

క. ఇల దీర్ఘరోగి కెవ్వడు
కలియంబడి కుక్కతరిమి ॥ కరిచిన యటులన్
కలఁగనియోనేని, మరణము
శిలశాసన మగుచునుండు ॥ శిఖనరసింహా. 276

♦ ప్రాస తప్పుగానున్నది.

తా. ఓ నరసింహాస్వామీ! దీర్ఘరోగియైయున్న వానిని స్వప్న మునందు కుక్కతరిమి కఱచినట్లు కలవచ్చెనేని తప్పక మరణము కలుగును.

క. రోగులు స్వప్నంబులలో
నేగతి జాబులును చదివి । రేని, నిజముగా
వేగముగ యముని గాంతురు
శ్రీగౌరీశనుతపాద । శిఖనరసింహా. 277

తా. ఈశ్వరునిచే పొగడబడిన పదములు గల నరసింహాస్వామీ! రోగులు ఉత్తరములు చదివినట్లు కలఁగాంచినచో మరణింతురు.

—: ప్రా ణి ప్ర భృ తి శ కు న ము లు :—

క. సాలెపురు గొండలిమీఁదను
చేలముపైఁ బ్రాకెనేని । శీఘ్రంబుననే
చేలములు క్రొత్త వచ్చును,
శ్రీలలనా హృద్విహార । శిఖనరసింహా. 278

తా. ఓలక్ష్మీమనోనాయకా! నరసింహాస్వామీ! సాలెపురుగు శరీరము మీఁదను; బట్టలమీఁదను ప్రాకిన యెడల త్వరలో క్రొత్తవస్త్రములు లభించును.

క. బరిణ పురుగులును కప్పలు
స్థిరమగు జలపక్షి రొదలు । చీమలబారుల్
కరమరుదుగ బహుళంబుగ
సిరి మగఁడా! కాంచవృష్టి । శిఖనరసింహా. 279

తా. ఓలక్ష్మీనాథా! నరసింహాస్వామీ! బరిణపురుగులు; కప్పలు; జలపక్షులధ్వనులు, చీమలబారు తరుచుగాఁ గనబడుచున్నచో ఎక్కువ వానలుకలుగును.

క. గుడి గల యఖండ మారిన
వడిసున్నపు కుండ నేల । బడి పగిలినచో
వడివడి దొంగలు వత్తురు,
చెడు గగపడుచుండు వేగ । శిఖినరసింహా. 280

తా. ఓ నరసింహస్వామీ! దేవాలయములో నుండు అఖండదీప మారిపోయినను, సున్నపుకుండ పడి పగిలిపోయినను దొంగలు వత్తురు.

క. బాలుర వాకిట గడపన్
బ్రేలుచు మూత్రించి నేల । వెస నలికినచో
మేలగు చుట్టాల్వత్తురు.
శీలంబగు భుక్తివేళ । శిఖినరసింహా. 281

తా. ఓ నరసింహస్వామీ! చిన్నపిల్లలు గడపమీఁద నుండి మాట్లాడుచు మూత్రము విసర్జించి నేల మీఁద అలికినచో భోజనవేళకు బంధువులువత్తురు.

క. మేనునఁ గల వస్త్రంబును,
మ్రానటు తగులుకొని లాగ । మ్రాన్పులియందున్
తేలు నొక విశేషంబట
శ్రీలోలా చిత్రమిద్ది । శిఖినరసింహా. 282

తా. ఓ లక్ష్మీనరసింహస్వామీ! ప్రయాణమై పోవునపుడు తన బట్ట చెట్టునకు తగిలికొని లాగిన మ్రాన్పడఁ జేసినచో అచట ఒక వింతకనబడును.

క. బాలకులు మన్నుఁ దిన్నను
చాలా ధరలెక్కు వగును । సరిధాన్యములకున్
ఆలాగు గడ్డిఁ గఱచిన
శీలత పశువులకు హాని । శిఖినరసింహా. 283

తా. ఓనరసింహస్వామీ! బాలురుమంటిని తినినయెడల ధాన్యము లకు ధరలు హెచ్చును. గడ్డిని తినినయెడల పశువులకు హానికలుగును.

క. పాప లేనట్టి యుయ్యేల
నూపిన, శిశువునకుఁ గడుపు । నొప్పిజనించున్
పాపను గర్భిణి సోకిన
శ్రీపతి కృశియించు పాప । శిఖనరసింహా. 284

తా. ఓ లక్ష్మీనరసింహస్వామీ! శిశువు లేకుండ ఉయ్యేల నూపిన చో శిశువునకు కడుపునొప్పి కలుగును. శిశువును గర్భిణీస్త్రీ తాకిన చో ఆశిశువు కృశించును.

క. శిశు బ్రహ్మ రంధ్రమందున
† కొస చను సోకంగమాత । కును నుడికలుగున్
‡ వెస మాత కాలి పాంసువు
శిశు సోకిన కడుపు శూల । శిఖనరసింహా. 285

తా. ఓ నరసింహస్వామీ! శిశువు బ్రహ్మరంధ్రమునందు తల్లి చనుమొన తగిలినచో తల్లికి చిక్కులు కలుగును. తల్లియొక్క కాలి దుమ్ము శిశువునకు సోకినచో గర్భశూల కలుగును.

క. గోరు పయి తెల్ల చుక్కలు
బారిన క్రొల్గంటులకును । బహువేగముగా
కోరిన ♦ వేఁకటి కలుగును
శ్రీరమణి హృదాబ్జభృంగ । శిఖనరసింహా. 286

తా. ఓ లక్ష్మీదేవి మనోవల్లభా! నరసింహస్వామీ! స్త్రీలకు గోళ్ల పయిన తెల్లని చుక్కలు కనబడినయెడల త్వరలో కోరిన గర్భము నిలుచును.

---

† ‡ ప్రాసలు సరియైనవి కావు.

♦ ప్రేఁకటి రూపాంతరము.

క. బోరగిల బోళ్లు బడుటయు,
నారయ బోళ్ల కను తూటు । లడుగునబడినన్
వారక తిరుగలి పగిలిన,
చేమున్ § కొడి యొఱుగకీడు । శిఖనరసింహా. 287

తా. ఓనరసింహస్వామీ! బోళ్లుబోరగిలపడినను బోళ్ల డుగునరంధ్రములు పడినను తిరుగలి పగిలినను దీపపుశిఖ యొఱిగినను కీడుకలుగును.

క. కుడి కాలడుగున జిలగొన
వడి చుట్టాల్వత్తు, రెడమ । వైపున కలుగన్
తడవుగ ప్రయాణమబ్బును,
చెడుగిట్లతి వలకు గలుగ । శిఖనరసింహా. 288

తా. ఓ నరసింహస్వామీ! కుడికాలు అడుగున జిలపుట్టినచో బంధువులు వత్తురు. ఎడమ అఱికాలులో జిల కలిగినచో ఆలస్యముగా ప్రయాణము కలుగును. ఇట్లు స్త్రీలకు జరిగిన యెడల కీడు కలుగును.

క. ఘన కార్య లోచనములు,
పని బడి శుభ కార్యములకు । ప్రారంభములన్
కన కన గాడిద కూసిన
చినయోబళ గిరివిహార । శిఖనరసింహా. 289

తా. ఓ అహోబిల పర్వతమందు విహరించే నరసింహస్వామీ! గొప్ప పనులను గురించి ఆలోచించు నప్పుడును, శుభకార్యముల ప్రారంభము లందును గాడిద కూసిన యెడల శుభమగును.

క. తనగోవు, యెద్దు, చిలుకయు,
శునకము, గుఱ్ఱంబుగనుల । సొనసొననీరున్
గొనకొని విడిచిన చేటగు
చినయో బళగిరి విహార । శిఖనరసింహా. 290

§ కొడి=దీపపుశిఖ తత్సమశబ్దము.

తా. ఓ అహోబిల పర్వతమందు విహారించే నరసింహస్వామీ! తాము పెంచుచున్నట్టి ఆవు, ఎద్దు, చిలుక, కుక్క, గుఱ్ఱము, ఇవి కండ్లనుండి నీరు సొటసొట కార్చినచో కీడు కలుగును.

క. గేహంపా వరణమునన్,
గేహో సరి తలమునందు, । గీమునన్లై నన్,
"హూహూ" యని గూ బరచిన,
శ్రీహృదయ విహార! కీడు, । శిఖనరసింహా. 291

తా. శ్రీదేవీ హృదయమందు విహారించే నరసింహస్వామీ! తన యింటి యావరణములోఁ గాని, యింటి పైభాగమునఁగాని, ఇంట్లోగాని, "హూ. హూ"అని గుడ్లగూబ అరచినచో కీడు.

క. కాపురముండెడు నింటన్,
యేపారఁగ తేనె తెట్టె । యిల బెట్టినచో
కాపురము చెడును; కాలును
శ్రీపతి యాగృహము వేగ । శిఖనరసింహా. 292

తా. ఓ లక్ష్మీపతీ! నరసింహస్వామీ! కాపురమున్న యింటిలో తేనటీగలు పట్టుపెట్టినచో సంసారము చెడును. త్వరలో ఆగృహము కాలిపోవును.

క. కానఁగ రాముని హస్తము,
† శ్వాన ఛత్రంబు లిండ్ల । జనియించినచో
మానవలె నాగృహంబుల,
శ్రీనిలయా! చేటు కలుగు । శిఖనరసింహా. 293

తా. ఓ లక్ష్మీనిలయా! నరసింహస్వామీ! ఇండ్లలో రామునిచేయి (మొండిచేయి) కుక్క గొడుగులు మొలిచినయెడల ఆయిండ్లు వదిలివేయవలయును. లేనియెడల చేటు కలుగును.

(శాంతి చేసుకొనవలెను. గ్రంథాంతరము.)

† గణము తప్పినది.

క. నున్నంబు పసుపునైనను,
పన్నగ నాయింటి నేల । పై బుడతలు, వే
గ్రన్నన చల్లుచునుండిన
చిన్నా బళగిరిశ! ఋణము । శిఖనరసింహా. 294

తా. ఓ అహోబిలగిరీశా! నరసింహస్వామీ! పిల్లలు సున్నము, పసుపు, ఇంటి నేలపై జల్లుచుండినచో; ఆయింటియందుండు వారికి ఋణబాధ కలుగును.

క. † రాపుఁగృకలాస నలికిరి,
యేపున నెవరింటిమీఁద । కెగ బ్రాకెడినో
ఆపురుషుఁడు, మాసద్వయి
శ్రీపతి! మోసంబు జెందు । శిఖనరసింహా. 295

తా. ఓ లక్ష్మీనృసింహస్వామీ! ఊసరవెల్లి, నలికండ్లపాము, రాపులుగు ఎవరింటిమీఁద కెగఁబ్రాకునో; ఆయింటి యజమాని రెండు నెలలో ప్రమాదముచెందును.

క. ఎవనింట నల్లు లెక్కువో
భువి లాభము తగ్గుచుండు, । మూషకములు నె
క్కువమైన భోజనంబున
శివనుత యభివృద్ధి కలుగు । శిఖనరసింహా. 296

తా. ఓ శివునిచే పొగడఁబడిన నరసింహస్వామీ! ఇంటియందు నల్లు లెక్కువగు చున్నవారికి లాభము తగ్గును. ఎలుకలు ఎక్కువగు చున్నవారికి భోజన మందభివృద్ధి కలుగును.

† విశే:—రాపు=రాపులుగు = కంకము! కృకలాస= ఊసరవెల్లి, నలికిరి=నలికండ్లపాము.

—: సర్వజనావశ్యకములు :—

క. దారు పనులందు పాదుక
లారయ, పీటలకు మంచ । మందలములకున్
తీరగు ♦ మేజాల్, బెంచీల్,
చీరున్ ప్రతిజిహ్వ కీడు । శిఖనరసింహా. 297

తా. ఓ నరసింహస్వామీ! పాదుకలు, పీటలు, మంచములు, పాల కీలు, మేజాబల్లలు, బెంచీలు చేయుటకు ఎదురు నాలుకలుగల కఱ్ఱలు పనికిరావు.

క. మొలగట్టిన దోవతి, చెరు
గలయుచు ద్రొక్కుచును పయన । మైనట్టయినన్
కలహంబుఁ గార్యహానియు
చెలువు సెడున్ జనుల కెపుడు । శిఖనరసింహా. 298

తా. ఓ నరసింహస్వామీ! కట్టుకొనిన వస్త్రము యొక్క చెఱఁగును త్రొక్కుచు ప్రయాణమయిన యెడల కలహము, కార్యహాని, అందహీనము కలుఁగును.

క. పదునెనిమిది, మూఁ, డెనిమిది
పదు మూఁడవ, దినములందు । పనులెయ్యవియున్
మొదలిడఁగరాదు, చెడునవి,
చెదరున్ తీన్ తేర యనఁగ । శిఖనరసింహా. 299

తా. ఓ నరసింహస్వామీ! 18, 3,8, 13, దినములలో యేపనియును ప్రారంభించరాదు. ప్రారంభించినచో తీన్ తేరగా చెడిపోవును.

♦ మేజాలు బెంచీలు అన్యభాషా పదములు.

క. ఎనిమిది, పదమూఁడును, పదు
నెనిమిది, మూ, డ్దినములందు । నెవ్వనిజనియో,
కొనసాగు నతఁడు, పని చే
సిన నాదినములను, మేలు । శిఖనరసింహా. 300

తా. ఓ నరసింహస్వామీ! 8, 13, 18, 3 దినములందు జన్మిం
చిన వాఁడాదినములందే కార్యము చేసినను అభ్యంతరము లేకుండ
నెఱవేరును.

—: అ వ శ కు న శాం తి :—

క. ఏ కార్యము తలపెట్టిన,
నాకట నవశకునమైన । నక్కార్యంబున్
సోకక విడుచుటయే తగు
శ్రీకర, దాని కది శాంతి । శిఖనరసింహా. 301

తా. ఓ నరసింహస్వామీ! ఏపనినైన చేయఁబూనినప్పుడు, అపశ
కునమైనచో, ఆకార్యమును విడుచుటయే దాని కది శాంతి యగును.

క. అవని నే పనుల కాదిని,
నవశకునంబైన వెనుక । కరిగి పదములన్
కవకడిగి దేవు నెంచుచు,
శివనుత యత్నించు మటల । శిఖనరసింహా. 302

తా. ఓ మహేశ్వరవినుతా! నరసింహస్వామీ! ఏపనికైన ప్రారం
భమున అపశకునము అయినచో వెనుకకు పోయి పాదప్రక్షాళనము
చేసి దేవుని ధ్యానించి మరల ప్రారంభింపవలయును.

క. స్మృతి శ్రుతి మతముల నమ్మక
మతికిన వారలకె సఫల ౹ మగు శకునంబున్
శ్రుతి వేని వారి కవి వృథ
శ్రిత శతమఖముఖ్యపాల ౹ శిఖినరసింహా. 303

తా. ఓ శ్రిత శతమఖముఖ్యపాల శిఖినరసింహమూర్తీ! స్మృతి శ్రుతులయందు నమ్మక మున్నవారికి శకునములు సఫలమగును. శాస్త్ర నమ్మకము లేని వారికి ఫలించవు. †

# స్వర లక్షణము.

(ఇక్కడనుండి కడవరకును వ్రాతప్రతులలో నున్నది.)

శ్లో. నాసాదక్షిణ భాగజాత పవనస్సూర్యాఖ్య నాడీశుభా
సంగ్రామవ్యవహార, మైథున భయస్నానాన్న భంగార్తిషు
నాద్యన్యాశశిన శుభైవ గమనాలంకార ప్రాణిగ్రహే
క్షేత్రాదేషు యదంశ వాయుచలనం తత్పాద పూర్వంవ్రజేత్.

తా. ముక్కుయొక్క కుడిప్రక్కఁ బుట్టిన వాయువు సూర్యనాడి యని పేరు. అది అయిదు ఘడియలు సంచరించును. యుద్ధమునకుఁ బోవునపుడు వ్యవహారములకు బోవునపుడు గర్భాదాన మందును భయపడు సమయమందును మంగళస్నానమునకు బోవునపుడు భోజన కాలమందును, అపజయము తటస్థించు నపుడును బాధలు సంభవించు నపుడును ఆవాయువు శుభప్రదము. ముక్కుయొక్క యెడమప్రైపునఁ బుట్టిన వాయువు చంద్రనాడి యనబడును. అది అయిదు ఘడియలు

† దీనితరువాత మరల తొందపాటు తిరిగివేసి ఉన్నది.

సంచరించును. ప్రయాణము లందును, ఆభరణములు ధరించుకొనఁ బోవునపుడును, వివాహకాలమందును, చేనుదున్నబోవు నపుడును, ఇల్లుగట్టబోవు నపుడును వనములువేయఁ బోవునపుడును, ఆవాయువు శుభప్రదము.

కుడిముక్కున వాయువు వచ్చునపుడు కుడి కాలును; ఎడమ ముక్కున వాయువు వచ్చునపుడు యెడమకాలును ముందుగా నుండి నడువ వలెను. యుద్ధము మొదలైన కార్యములకు, కుడికాలును, ప్రయాణము మొదలగు కార్యములకు యెడమ కాలును ముందుగా నుండి నడువవలెను.

## —: గౌ రీ పం చాం గ ము :—

గౌరీ పంచాంగములోఁ జెప్పియుండు ముహూర్తముల ప్రకారము తాము తలచిన కార్యములకుఁ బోయిన ఫలము లొందుదురని ఋషులు చెప్పియున్నారు. ముహూర్తము 1కి మూడు ముప్పాతిక ఘడియలు అనగా 1½ గంటలకాలము. పగలు రాత్రులు ప్రమాణములను 8చే భాగింపఁగా ముహూర్త కాలమగును.

♦ సదరు ముహూర్త కాలములను, ఆదినము వారాధిపతి మొదలు, రవి, కుజ, గురు, బుధ, శుక్ర, శని, చంద్ర, రాహువులు క్రమముగా 8 కాలములకు అధిపతులు. పాపగ్రహాది పత్యకాలములు శుభకార్యములు వర్జింపతగినవి. రాహుకాలము, మిక్కిలి వర్జనీయము.

♦ ఈవిషయ మితరగ్రంధములనుండి క్రోడీకరించి చేర్చితిని.

## —: పగటి ముహూర్తములు: —

| నం | ప్రమాణం | ఆది | సోమ | మంగళ | బుధ | లక్ష్మి | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ౩౻ | ఉద్యో | అమృ | రోగం | విషం | ఉద్యో | రోగం | విషం |
| 2 | ౭౺ | లాభం | విషం | ఉద్యో | అమృ | విషం | జ్వరం | అమృ |
| 3 | ౧౧౹ | విషం | ఉద్యో | జ్వరం | శుభం | జ్వరం | అమృ | జ్వరం |
| 4 | ౧౫ | అమృ | లాభం | లాభం | ఉద్యో | లాభం | కలహ | ఉద్యో |
| 5 | ౧౮౻ | శుభం | జ్వరం | అమృ | రోగం | అమృ | లాభం | శుభం |
| 6 | ౨౨౺ | ధనం | అమృ | ఉద్యో | శుభం | విషం | సుఖం | లాభం |
| 7 | ౨౬౹ | అమృ | ఆదా | విషం | ధనం | కలహం | ధనం | ధనం |
| 8 | ౩౦ | విషం | ధనం | లాభం | అమృ | జ్వరం | అమృ | లాభం |

## —: రాత్రి ముహూర్తములు: —

| నం | ప్రమాణం | ఆది | సోమ | మంగళ | బుధ | లక్ష్మి | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ౩౻ | శుభం | రోగం | జ్వరం | లాభం | సుఖం | అమృ | విషం |
| 2 | ౭౺ | అమృ | లాభం | ఉద్యో | రోగం | రోగం | జ్వరం | ఉద్యో |
| 3 | ౧౧౹ | జ్వరం | ఉద్యో | కలహ | విషం | కలహ | కలహ | శుభం |
| 4 | ౧౫ | రోగం | ధనం | లాభం | ఉద్యో | లాభం | లాధం | అమృ |
| 5 | ౧౮౻ | కలహ | రోగం | రోగం | శుభం | ఉద్యో | శుభం | కలహ |
| 6 | ౨౨౺ | లాభం | అమృ | లాభం | లాభం | జ్వరం | ధనం | రోగం |
| 7 | ౨౬౹ | ఉద్యో | విషం | ఉద్యో | ధనం | లాభం | అమృ | అమృ |
| 8 | ౩౦ | రోగం | జ్వరం | ధనం | లాభం | ఉద్యో | విషం | లాభం |

## —: తుమ్ము లక్షణము :—

తనకు నెదుట యేదిక్కునుండి తుమ్ముచున్నాడో ఆ యాదిక్కులకు వార క్రమ జాములతో వివరించే ఫలం.

| | వా.జా | తూర్పు | ఆగ్నేయం | దక్షిణం | నైరుతి | పడమర | వాయువ్యం | ఉత్తరం | ఈశాన్యము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఆదివారము | 1 | మంచిది | మధ్యము | బంధువులువత్తురు | మంచిది | వ్యాధి | సజ్జనులసంభాషణ | భాగ్యంకలు॥ | కన్యలువత్తురు |
| | 2 | మంచిది | మధ్యం | మంచిది | చిక్కులు | సుఖం | అర్ధనాశనం | సజ్జనాగమనం | బంధువులువత్తురు |
| | 3 | వర్షంకురుచును | మధ్యము | ఉత్తమం | శ్రమ | భాగ్యంవచ్చును | మరణం | ఎరిగినవా॥వత్తు | అర్ధనాశనం |
| | 4 | మంచిది | ప్రయాణం | మధ్యమం | వ్యసనం | బంధువులురాక | మరణం | అర్ధనాశనం | చిక్కులు |
| సోమవారము | 1 | మంచిది | చిక్కులు | చెడ్డసొమ్ముచేకూడుట | వ్యసనం | సుఖం | మరణం | అర్ధనాశనం | బంధువులురాక |
| | 2 | మధ్యమం | సుఖం | కష్టం | అయినవా॥వత్తు | అర్ధనాశనం | మంచిది | మరణం | బంధువులురాక |
| | 3 | మంచిది | మధ్యమం | సుఖం | సజ్జనాగమనం | అర్ధనాశనం | మంచిది | లాభం | బంధుదర్శనం |
| | 4 | మరణం | మంచిది | జయం | చిక్కులు | సుఖం | ఉత్తమం | అయినవా॥వత్తు | మంచిది. |
| మంగళవారము | 1 | ఉత్తమం | మధ్యము | స్త్రీలురావడం | శ్రమ | సుఖం | మరణం | లాభం | అర్ధనాశనం |
| | 2 | తన్ననుసరిం॥రాక | జయం | మధ్యము | రక్తముచూచును | అధికలాభం | వర్షనాశనం | సుఖం | కలహము |
| | 3 | మరణము | ఉత్తమం | స్త్రీలరాక | చిక్కులు | జయం | అర్ధనాశనం | అనుసరించిన॥వా॥వత్తు | రక్తముచూచును |
| | 4 | చిక్కులు | ఉత్తమం | మధ్యమం | స్త్రీలరాక | అర్ధనాశనం | మంచిది | మరణం | కష్టము. |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మంగళవారము | 1 | మంచిది | మధ్యమం | మంచిది | మరణం | సుఖం | వ్యాధి | మరణం | చెరుపు |
| | 2 | అర్ధనాశనం | చిక్కులు | రక్తముచూచును | మంచిది | భయం | సుఖం | వర్షనాశనం | భాగ్యమువచ్చును |
| | 3 | అనుస॥వా॥వత్తు | మధ్యమం | చెడ్డసొమ్ముచేరును | అర్ధనాశన | భయం | మంచిది | మంచిది | చిక్కులు |
| | 4 | మరణం | శుభవా॥వచ్చు | క్రోధము | సుఖం | వర్షముకురుచును | చిక్కులు | ఎరిగినవా॥వత్తు | మధ్యమం |
| బుధవారము | 1 | ఉత్తమం | మధ్యమం | సజ్జనులరాక | చిక్కులు | లాభము | మరణం | శుభవార్త | మరణము |
| | 2 | లాభం | మంచిది | మరణము | కన్యలరాక | మధ్యమము | అనుస॥వా॥వత్తురు | మరణం | శుభవార్త |
| | 3 | లాభం | మరణము | సుఖము | మధ్యమము | ఎరిగిన॥వా॥వత్తు | గ్రామలాభం | భాగ్యమువచ్చు | మరణము |
| | 4 | మరణం | లాభం | శుభవార్త | సుఖం | అనుస॥వా॥వత్తు | మంచిది | విశేషలాభం | మధ్యం |
| శుక్రవారము | 1 | కన్యప॥రాక | మంచిది | భీతి | భీతి | అనుస॥వా॥వత్తు | మంచిది | విశేషలాభం | మధ్యమము |
| | 2 | మధ్యమం | మధ్యమం | చిక్కులు | మంచిది | అనుస॥వా॥వత్తు | సుఖం | వర్షించును | అర్ధనాశనము |
| | 3 | శుభవార్త | ఉత్తమము | చిక్కులు | విశేషఫలము | . సుఖము | లాభము | అర్ధనాశము | అర్ధనాశనము |
| | 4 | చిక్కులు | సుఖము | మధ్యమము | మరణము | విశేషధనము | వర్షముకురియును | రక్తముచూచును | స్నేహప్రీతి |
| శనివారము | 1 | శుభవార్త | చిక్కులు | బంధువులువత్తురు | వి॥మ॥భూ॥గ | మరణము | శుభము | బంధువులువత్తు | మరణము |
| | 2 | శుభవార్త | శుభము | స్త్రీలువత్తురు | మరణము | ధనలాభము | మంచిది | అనుస॥వా॥వత్తు | విశేషలాభము |
| | 3 | మంచిది | సుఖము | అర్ధనాశనము | చిక్కులు | వ్యసనప్రాప్తి | అనుసరించినవా॥వత్తు | సజ్జనాగమన | కన్యపడుచులను జూ॥ |
| | 4 | ఉత్తమము | కీడు | మధ్యమము . | అనుస॥వా॥వత్తు | విశేషలాభము | దేవతాదర్శనము | పుత్రోత్పత్తి | సుఖము |

ఈతుమ్ములక్షణం అన్నిప్రతులలోను వారములు జాములు దిక్కులు వరుసగా వ్రాసియుండెను. సూక్ష్మముగా తెలియుటకై ఈచక్రమున అభావములనే పొందుపరచితిని.

—: ప్రయాణ దినముల వార శూలలు :—

శ్లో॥ అంగార పూర్వే గమనేచ లాభం। సోమేశ నిర్దక్షిణ మర్థలాభం।
బుధాగురా పశ్చిమకార్యసిద్ధి। రవౌభృగాచోత్తరధాన్యలాభం।

శ్లో॥ నపూర్వేశని సోమేచ। నగురుర్దక్షిణ స్తథా।
నపశ్చాద్భాను శుక్రేచ నోత్తరే బుధమంగళే॥

తా. తూర్పునకు మంగళవారము లాభం. దక్షిణమునకు సోమ శనివారములు ధనలాభం. పడమరకు బుధ, గురువారములు కార్యసిద్ధి. ఉత్తరమునకు ఆది, శుక్రవారములు ధాన్యలాభము.

వారశూలలు:—తూర్పునకు శని సోమవారములు, దక్షిణమునకు గురువారము, పడమరకు ఆది శుక్రవారములు, ఉత్తరమునకు మంగళ బుధవారములు.

—: కరిదినములు (కరినాళ్లు) :—

చిత్రినెల ౬-౧౫, వైయ్యాశి ౧-౬-౧౦, ఆని ౧-౬, ఆడి ౨-౧౧-౨౦, ఆవణి ౨-౧౬-౨౮, పెరటాశి ౧౬-౨౯, అల్పిశి ౬-౨౦, కార్తికి ౧-౧౦-౧౭, మార్గళి ౬-౯-౧౧, తై ౧-౨-౩-౧౧-౧౭, మాశి ౧౭-౧౬-౧౦, పంగుని ౬-౧౫-౧౬.

సూచన:—మూలగ్రంథములలో పై ప్రమాణములు సరిగా లేకుంటచే ప్రస్తుతము వాడుకలో నున్న విధముగా సరిజేసితిని. ఇందులోని తేదీలయొక్క పగలు శుభకార్యములందు వర్జింపవలెను. ఇది ద్రావిడాచారమతము. కరిదినములనే మాసత్యాజ్యములని పేరు.

| * రాహుకాలము | | | | | గుళికకాలము |
|---|---|---|---|---|---|
| వారము | గడియలు | | ఘంటలు | | గడియలు |
| | మొదలు | వరకు | మొదలు | వరకు | |
| ఆదివారము | ౨౬¼ | ౩౦ | 4½ | 6 | 26¼ మీద 3¾ |
| సోమవారము | ౩¾ | ౭½ | 7½ | 9 | 22½ ,, |
| మంగళవారము | ౨౨½ | ౨౬¼ | 3 | 4½ | 18¾ ,, |
| బుధవారము | ౧౫ | ౧౮¾ | 12 | 1½ | 15 ,, |
| గురువారము | ౧౮¾ | ౨౨½ | 1½ | 3 | 11¼ ,, |
| శుక్రవారము | ౧౧ | ౧౫ | 10½ | 12 | 7½ ,, |
| శనివారము | ౭½ | ౧౧¼ | 9 | 10½ | 3¾ ,, |

§ రాహుకాలములో శుభకార్యములు. గుళికకాలములో తద్వ్యతిరిక్తకార్యములు చేయగూడదు. సదరు కాలములు 3¾ గడియలు (అనగా ఘ 1-30 ని) ఉండును.

శ్లో॥ ఉదయాదుత్తరంగచ్ఛే, దస్తమానేచదక్షిణే।
మధ్యాహ్నేపూర్వయాత్రయా, మర్ధరాత్రౌతుపశ్చిమే।
తిథిర్నచ నక్షత్రంన లగ్నం నతు చంద్రమాత్।
వజ్రయోగప్రయాణేన, కార్యసిద్ధి ఫలంలభేత్॥

* రాహుకాలమును పైశ్లోకమును 2వ ప్రతిలో లేవు.

సూచన:—రాహుకాల మొక్కటే యుండగా గుళిక కాలమును చేర్చి వాట్లనుపయోగ విధముగా మార్చి కూర్చితిని.

§ ఈవిషయము ఇతరగ్రంథముల నుండి క్రోడీకరించితిని.

శిఖి నరసింహ శతకము
తాత్పర్యసహితము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ.

రామమోహనప్రెస్, రాజమండ్రి:—1936.

# జాతకమార్తాండము.

## గ్రంథకర్త:—ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు.

### మొదటిభాగము.

జ్యోతిషమందు యేమియు ప్రవేశము లేనివారికి యీ మొదటిభాగము చాలా ఉపయోగించును. దీనియందు రాశిచక్రము, అంశచక్రము తయారుచేయువిధము లగ్ననిర్ణయము జేయువిధము, జననకాలదశాశేషము గనుగొనువిధము, పగలురాత్రి, ప్రాద్దుకట్టువిధము గ్రహములయొక్క, రాసులయొక్క సంజ్ఞాధ్యాయము, జాతకుని యొక్క ఆయుర్భాగ్యములు సంతానము మొదలగు ద్వాదశభావఫలములను సులభముగా యెవరికివారు తెలిసికొనువిధము, మహాదశ అంతర్దశవిదశలను గనుగొనువిధము యివి అన్నియు దీనియందు ఉదాహరణములతో వ్రాయబడినవి. ఇది సర్వజనులకు ఉపయోగించును. వెల రు 1—8—0.

### జాతకమార్తాండము:—రెండవభాగము.

దీనియందు ద్వాదశభావఫలములు ప్రమాణశ్లోకములతో మిక్కిలి వివరముగా వ్రాయబడినవి. లగ్నస్ఫుటము, గ్రహస్ఫుటము, భావస్ఫుటము అష్టకవర్గ యెవరికి వారు సులభముగా తయారుజేసుకొనుపద్ధతి అంతయు ఉదాహరణపూర్వకముగా దీనియందు వ్రాయబడినది. యే మహాదశలో యే అంతర్దశలో యేయేఫలములు జరుగునో అవివరమంతయు ప్రమాణశ్లోకములతో తెనుగు అర్థముతో సంపూర్ణముగా వ్రాయబడినవి. ఈగ్రంథముయొక్క విలువ వర్ణనాతీతమని మీకే బోధపడగలదు.

వెల రు 1—8—0.

### జాతకమార్తాండము:—మూడవభాగము.

దీనియందు యేలగ్నమునకు యేగ్రహము యెక్కడనుండిన యేయేఫలముల నిచ్చునో అవివరమంతయు మేషలగ్నము మొదలుకొని మీనలగ్నము ఆఖరువరకు 12 లగ్నములకు యావత్తుఫలములు సంపూర్ణముగా శ్లోకార్థములతో వ్రాయబడినవి. కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు. వెల రు 2—0—0.

షరా:—యీపైన ఉదహరింపబడిన జాతకమార్తాండము 3 భాగములు చదివినవారికి యీశాస్త్రమందు సంపూర్ణప్రవేశము కలుగునని వేనకువేలు మాకుయిచ్చిన యోగ్యతాపత్రములె సాక్ష్యములు.

# ఆంధ్ర జాతక తత్వము.

గ్రంథకర్త:—ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు.

సూత్రములు:—1, 2 భాగములు.

ఈగ్రంథము పూర్వకాలమునందు శ్రీమహాదేవదైవజ్ఞునిచే సంస్కృతభాషలో వ్రాయబడినది. 30, 40 ప్రాచీన జ్యోతిషగ్రంథములయొక్క ముఖ్యాభిప్రాయము లను సమీకరణముచేసి యీమహానీయుడు సూత్రముల పూర్వకముగా యీగ్రంథము రచియించి యుండెను. ద్వాదశభావఫలములను అనేక విశేషాంశములతో సూత్ర పూర్వకముగా వీటియందు సవిస్తరముగా వ్రాయబడినవి. అన్నిగ్రంథములలోను యిది చాలా గొప్ప గ్రంథమగుటచే లోకోపకారముకొరకు అనుసూత్రములన్నియు తెలుగుభాషలో వ్రాసి ప్రతిసూత్రమునకు తెలుగున అర్థము వ్రాయబడెను. మొత్తము 2100 సూత్రము లుండుటచే నిది రెండుభాగములుగా విడదీసి వేరు వేరుగా అచ్చు వేయించి యున్నాను. యీ 2 భాగములను పూర్తిగా 1, 2, సార్లు చదివినయెడల 30, 40 జ్యోతిషగ్రంథములయొక్క సారమును గ్రహించునట్టి శక్తి గలుగును. ఈగ్రంథములు సంస్కృతభాషలో సుమారు ఒకలక్షవరకు ఖర్చుపడినవి.

మొదటి భాగము వెల 1—8—0.

రెండవ భాగము ,, 1—8—0.

# జ్యోతిష ప్రథమ బోధిని.

గ్రంథకర్త:—ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు.

ఈచిన్నపుస్తకమును ఒకవారమురోజులు చదివిన ప్రతివారును వారివారి జాతకచక్రములను చేతపుచ్చుకొని అభ్యాసము చేసినయెడల జ్యోతిషమునకు కావల సిన విషయములన్నియు ఒక వారంరోజులలో పూర్తిగా తెలియును. కేవలము జ్యోతిషమందు ప్రవేశములేనివారికే ఉపయోగము నిమిత్తము యీపుస్తకము వ్రాయ బడినది. కనుక అట్టివారు దీనిని జదివి దీనియుపయోగములను తెలిసికొందురని నమ్ముచున్నాను. ఎవరిదేశమందు ఏచక్రము వాడబడుచున్నదో ఆచక్రమును బట్టి అభ్యాసము చేసినయెడల దీనియందు వ్రాయబడిన ప్రతివిషయము సరిగా తెలియును.

వెల రు 0—8—0.

# జ్యోతిష విద్యా ప్రకాశిక.

గ్రంథకర్త:—ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు.

1. సంజ్ఞాధ్యాయము 100 పేజీలు. వెల రు 1—0—0

నక్షత్రములు, గ్రహములు, రాసులు వీటి స్వభావములు వీని యుపయోగములు మొదలగునవి.

2. గణితాధ్యాయము 112 పేజీలు. వెల రు 1—0—0

జననకాల ఘడియలనుబట్టి జన్మలగ్నమును స్థిరపరుచుట, ఆరూఢచక్రము, గ్రహస్ఫుటము మొదలగు యావద్గణిత విషయములు యిందు విమర్శింపబడినవి.

3. భావఫలాధ్యాయము 400 పేజీలు. వెల రు 3—0—0

ద్వాదశభావఫలములు అనగా వానియొక్క సంజ్ఞలును జాతకునియొక్క రూపలక్షణములు, ఆయుర్భాగ్యములు వివరముగా దారాపుత్రాది విషయములు, పితృవిషయము జాతకునియొక్క ఉద్యోగము, జీవనము, ధనలాభము, ధనవ్యయము మొదలగు ద్వాదశభావఫలములు విమర్శింపబడెను.

4. దశఫలాధ్యాయము 300 పేజీలు. వెల రు 2—0—0

ఏమహాదశలో యేయే ఫలితములు జరుగునో అవియును ప్రతిమహాదశకు అంతర్దశా ఫలములను, శాస్త్రప్రమాణములతో సులభముగా తెలుసుకొనువిధము వ్రాయబడెను.

# గర్గసంహిత.

గ్రంథకర్త:—ఆకెళ్ల వెంకటశాస్త్రిగారు.

భావఫలాధ్యాయము.

ఈగ్రంథము ప్రత్యేకము జననకాలఘడియలు లేనివారికిని జన్మలగ్నమురేది యయినది తెలియక సందేహపడువారికిని మిక్కిలి ఉపయోగించును. యిందు 80 శ్లోకములు తెలుగున తాత్పర్యముతో వ్రాయబడెను. వెల రు 0—4—0

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య,
శ్రీసత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# నవలలు—పరిశోధకనవలలు

| | రు. అ. | | రు. అ. |
|---|---|---|---|
| పంజాబు మెయిలు | 0-12 | విషహృదయం | 1-0 |
| నీవేనా | 0-12 | టోపీనాను కామిక్ | 0-6 |
| చదువుకొన్న భార్య (Educated wife) | 0-12 | వలపులరాణి | 0-12 |
| శక్తికుమారి | 0-12 | దొంగలనాయకుడు | 0-12 |
| అయిదులక్షలరూపాయలు | 0-12 | అర్ధరాత్రపువింత 3 హత్యలు | 0-12 |
| అల్లూరి సీతారామరాజుచరిత్ర | 0-6 | లోకాభిరామాయణం కామిక్ | 0-6 |
| రమాసుందరి 1, 2 భా॥ | 1-8 | పరిశోధన | 0-12 |
| హాతింతాయి | 0-12 | మోహపిశాచము 1వ భా॥ | 0-12 |
| | | 2 వ భా॥ | 0-12 |

# కథలు—చరిత్రలు

| | | | |
|---|---|---|---|
| శ్రీనాధకవిచరిత్ర | 0-12 | మహాపతివ్రతలకథలు | 1-0 |
| భోజకాళిదాసు కథలు | 0-12 | పంద్రెండురాజుల కథలు అను శ్రీకృష్ణబోధామృతం | 0-12 |
| భట్టివిక్రమార్కుల కథలు 52 | 1-0 | శుకసప్తతికథలు | 0-8 |
| గులోబకావళి కథలు | 0-12 | మదనకామరాజుకథలు | 0-8 |
| తెనాలిరామకృష్ణకవిచరిత్ర | 0-12 | | |

# శృంగారగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| పడకటింటిముచ్చట్లు | 0-12 | మన్మథసామ్రాజ్య అను కళాశాస్త్రరహస్యములు | 0-1 |
| సతీపురుషరహస్యములు | 1-0 | అంతఃపురరహస్యాలు | 0-1 |
| శృంగారపద్యములు | | మోహలేఖలు అనూ లౌలెటర్సు | 0-1 |
| లౌలెటర్సుకు ఉపయోగము | 0-4 | | |

# టీకాశతకములు

| | | | |
|---|---|---|---|
| బాలరామాయణం టీక. | 0-12 | సుమతీశతకం టీక | 0- |
| భాస్కరశతకం ,, | 0-4 | నరసింహశతకం ,, | 0- |
| కుమారీశతకం ,, | 0-2 | కృష్ణశతకం ,, | 0- |
| వేమనశతకం ,, | 0-3 | దాశరధీశతకం ,, | 0- |
| గజేంద్రమోక్షం ,, | 0-6 | రుక్మిణీకళ్యాణం ,, | 0- |
| కాళహస్తీశ్వరశతకం,, | 0-6 | శివానందలహరి ,, | 0- |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణబుక్ డిపో, రాజమండ్రి.